Bhagavan
Satya Sai baba Prasans

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

# భగవాన్
# సత్యసాయిబాబాప్రశంస

రచయిత

కాశీభట్ల గౌరీపతిశాస్త్రి



శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

# భగవాన్

# సత్యసాయిబాబాప్రశంస

రచయిత

కాశీభట్ల గౌరీపతిశాస్త్రి.

ప్రకాశకులు :

శ్రీశ్రీ గోగినేని శేషగిరిరావుగారు

మానికొండ

( క్రిష్ణా జిల్లా )

ఓం.

అవిఘ్నమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# భగవాన్ సత్యసాయిబాబా ప్రశంస



పంచభూతాత్మకంబౌచు పరగు సృష్టి
నింపుగా బెంప యామీద ద్రుంపగలుగు
దేవతామూర్తివీవె నా దిక్కునీవె
పాహిమాం సత్య సాయిరాం! పాహిపాహి ! 1

పిన్నవై యుండి వెనుదీసి విషయములకు
విషమమవకుండ ధర్మము వెలయజేయ
ప్రభవమొందిన శ్రీ పరబ్రహ్మమూర్తి
పాహిమాం సత్య సాయిరాం! పాహిపాహి ! 2

సకల సౌందర్య సౌభాగ్య సంకలితము
సుగుణ శోభితమును సుమసుందరంబు
పూర్ణ సౌహార్ద మాధురీ పూరితంబు
నైన నీ మూర్తికివియె జోహార్లు సాయి! 3

తమ్ము దర్శింప కన్దోయి ధన్యమగును
తమ్ము వినినంత శ్రవములు ధన్యమగును
తమ్ము సేవింపగా జన్మ ధన్యమగును
సకల శుభదాయి! వరదాయి! సత్యసాయి! 4

నీవు పరాత్పుండవని
నిన్ను నెరింగి భక్తులెందరో
సేవలు సేయుచుండుటలు
చిత్తము పొంగగగాంచి నమ్మితిన్

తావక శక్తి కన్గొనెడి
దార్ఢ్యమొసంగి మహాత్మ, యీశ్వరా
కావుమటంచు వేడితిని
కావగదే నను సాయి సత్ప్రభూ ! 5

వదలక నీదు పాదముల !
వారిత భక్తినిగొల్వ పాపముల్
చిదురుపలై నసించుగద
చిన్మయమూర్తి! తదేకచింత నీ
పదకమలంబు గొల్చి భవ
బంధ విముక్తిని గాంచు భాగ్యమున్
ముదమున నా కొసంగ కయి
మోడ్చి నుతించెద సాయి సత్ప్రభూ ! 6

మరణము డాయుచుండెనను
        మాట యెరింగి కుమారుపేర నీ
స్మరణము సేయగా భవము
        మాసిన భక్తుని గాధవింటి. నీ
శరణము గోరినట్టి గజ
        చంద్రుని గాధయువింటి. మన్మదిన్
అరణము చేసివేచి, భవ
        దాదరమున్ గొననుంటి సాయిరాం! 7

నా కర్తవ్యమహర్నిశల్ తొలుత నీ
        నామంబు ధ్యానించుటల్
నీ కీర్తిన్ కొనియాడుటల్ మరి భవ
        ల్లీలల్ ప్రచారించుటల్

నీ కర్తవ్యము నీకు భక్తుడగు నన్నె
    న్లైని కాపాడుటో
లోకస్తుత్య పదారవిందయుగళా!
    లోకేశ! సాయిప్రభూ! 8

నీ వవతారమూర్తివిది
    నిక్కము నిత్యము తప్పకుండ నీ
సేవలుచేసి బత్తిగల
    చిత్తముతో నినుగొల్చు వారికిన్
త్రోవ లభించుగాదె అత
    దుస్తరమైన భవాబ్ధిదాట ఓ
పావనపూరుషా! పరమ
    పావననామ! దయాళు! సాయిరాం! 9

నేమముతప్ప క్లేశమ గ
ణింపక పెంచుడు మంచి భావముల్
తామస, లోభ, మోహము, మ
దంబును, మత్సరమున్ త్యజింపుచున్
కామితమెల్ల దీర్చుకొన
గా ననుగొల్చెడి భక్తకోటికిన్
స్వామివి నీవు భక్తుల వ
శంకర శంకరరూప సాయిరాం! 10

భుక్తి యిహంబునన్ మరియు
ముక్తి పరంబున బొందునట్టి యా
సక్తినిజూపు భక్తుల ప్ర
సన్నుడవై యనుకంప జీరుచున్

సూక్తులతోడ వారి మన
    సుల్ తనివిన్గన బాటజూపు నీ
శక్తికి సాటిలేదనుచు
    చాటెద నిత్యము సాయి సత్ప్రభూ ! 11

దోసము మోసమున్ గలిసి
    దుర్భరతన్బొనరించు జీవికన్
నా సఖులన్న మానవులు
    నాశము గోరుచునుండ్రి శత్రులై
ఏ సిలుగైన లేనియటు
    లియ్యెడ నన్ను కృతార్థుజేయగా
మీసరి మీరలే గనుక
    మిమ్ము భజించెద సాయి సత్ప్రభూ ! 12

మానవజీవితంబు అను
మానములో బడి యూగుచుండగా
మానవజాతికిన్ పరమ
మార్గముజూపి తరింపజేయగా
మానవమాత్రుడై ప్రభవ
మంది మహత్తును జూపినావు ఏ
మానవుడైనగాని తను
మానవుడౌ నినుజేర సాయిరాం! 13

పాపములాచరించితిని
ప్రాజ్ఞతలేమిని కొన్ని కొన్నిటిన్
కోపము నాపలేక అతి
క్రూరమతిన్ పొనరించియుండి హా

త్రాపము సైపలేక మిము
దాసితినయ్యా కృపాంబురాసి! నా
పాపములన్నిటిన్ సయిచి
పాలనసేయుము సాయి సత్ప్రభూ! 11

చేతిని నిన్న పాపములు
చేయుచునుంటిని నేడు రేపునున్
చేసెద కొన్నిటిన్ మనుజ
జీవితమియ్యెడ నట్టిదాటచే
ఓ సుగుణాకరా! అఘ జ
నోద్ధరణాభిద నిల్పుకొమ్మిదే
దోసిలియొగ్గినాడ నిజ
దోషము సైచుచు సాయి సత్ప్రభూ! 15

ఉక్తులు రిక్తవిగావివి
ముక్తిదుడగు సాయినిన్ ముముక్షువెరుంగున్
రిక్తముగా జీవించెడి
భక్తిరహితమహా ద్విపాద పశువేమిరుగున్. 16

నమ్మిన యుద్ధవుండు మది
నమ్మిన రాధయు గోపగోపికల్
నమ్మిన భీష్ముదున్ మిగుల
నమ్మిన పాండవులల్ల కృష్ణయున్
నమ్మిన శాబరీవనిత
నమ్మిన మహానులు వాయుసూనుదున్
నమ్మిన భక్తులెల్లరును
నాశముగాంచిరె సాయి సత్ప్రభూ ! 17

ఒకరననేల నిన్ గొలిచి
యుండిన భక్తసమూహమంతయున్
త్రికరణశుద్ధిగా గొలిచి
దివ్యపదంబును జేరినారలో
సకల ప్రపంచకర్త! సుర
సంతతికంతకు భర్త! హర్త! నా
కొకనికి మాత్రమే కొదువ
యుంచక కావుము సాయి సత్ప్రభూ! 18

గంటలు గతించు నిన్గన క్షణములుగను
మాసములు నేండ్లు గతియించు మాటవినిన
జన్మలెన్నియొ గతియించు జనులకెల్ల
క్షేమదాయకమైన నీ సేవవలన. 19

మతము ప్రకటనమును జేయు నతడటంచు
నందు రెరుగక కొందరు తొందరపడి
అన్ని మతములకును మూలమైనయట్టి
శక్తి వేనీవు నిజమిది సత్యసాయి ! 20

మూడులోకాలు బొజ్జలో ముడుచుకొన్న
నీవిరాణ్మూర్తి సందర్శనీయమగును
దాని దర్శింపగల్గెడి త్రాణనొసగి
జన్మ తరియింపజేయవే సత్యసాయి ! 21

రండి రండిటు భక్తులు రండిరండి
మనలనెల్లర కాపాడ మహిని వెలసి
దీవనలొసంగనున్నాడు దివ్యమూర్తి
సకల సద్గుణ శుభదాయి సత్యసాయి ! 22

వటదళమ్మున కనుమూయువారు వీరె
పాముపై పవ్వళించెడివారు వీరె
భస్మమున్దాల్చి తిరిగెడివారు వీరె
సకల శుభదాయి శ్రీ సత్యసాయి వీరె. 23

మంగళము శుభదాయికి మంగళంబు
మంగళము నిరపాయికి మంగళంబు
మంగళము ముక్తిదాయికి మంగళంబు
మంగళము సత్యసాయికి మంగళంబు. 24



జయగురుదేవ - జయమహాదేవ
జయపరమేశ జయవాగీశ జయజయ పృథ్వీశా-శ్రీశా
జయతుజయతు సర్వేశ మహేశా జయజయసాయీశా॥

జయరఘురామా జయరణభీమా
జయమేఘశ్యామా - రామా
జయతు జయతు జయరాఘవరామా
జయ సాయీ రామా ॥
జయశుభదాయి జయవరదాయి
జయముక్తిదాయి - సాయీ
జయతు జయతు జయషిర్డీ సాయీ
జయపర్తి సాయీ॥

—:o:—